శ్రీ పరమాత్మనే నమః

# చండకౌశికనాటకము

## నాంది

పొనరుచుఁ బెంచుఁ ద్రుంచు జగముల్ త్రిగుణాత్మత నీవిభుండె, యీ
యానపతత్త్వాష్టమూర్తులనె వ్యాప్తము విశ్వము, లేదు వంద్యుఁ డీ
తని కనుమాడ్కిఁ, గంకణపుఁ ద్రాఁచులఫూత్కృతిఁ దూలి నర్తనా
దిని బవలగ్న మాపశుపతి ప్రియవాంజలి మిమ్ముఁ బ్రోచుతన్.

చ. కనుఁగవ కెంపు బొమ్మముడి గల్గి దరస్ఫురితోష్ఠ మామొగం
బనయము నప్రసన్నహరిణాంకరుచిం బచరించుఁగాత, మా
యనునయముల్ వృథాయెఁ గ,ద్వదాగ్రహ మెచ్చెలుఁగావుతన్ మన
స్విని యఁ, దేటి గౌరి యెదఁ జేర్చిన శంకరుఁ డేలుతన్ మిమున్.

శా. ఆనందశ్లథమై సమాధుల, సుమాస్యశ్రీ విలాసోల్లసం
బై, నైజోరువికారితన్ ద్రుటి పెఱుగ్గై భ్రాంతమై స్మేరమై,
జ్యానాదం బొనరించుచో మరుఁడు గూఢుండై, కరంగం ఘృణా
స్థానంబై, రతి యేడ్వ సాస్రమగు నీశప్రేక్షఁ బ్రోచున్ మిమున్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు — అతివిస్తర మెందుకు? దుష్టామాత్యబుద్ధివాగురా
లంఘనసింహారంహుండును, భ్రూభంగలీలాసముద్ధృతాశేషకంట
కుండును, సమరసాగరాంతర్భ్రమద్భుజదండమందరాకృష్టలక్ష్మీ

స్వయంవరవల్లభుండు నగుశ్రీమహీపాలదేవునియాదేశంబు గాంచితిని. పురావిదు లుదాహరింతు నీప్రశస్తగాథ యీయనదే గదా!

మ. అనుకూలుండయి యాశ్రయించి గహనం బానార్యచాణక్యనీ
తిని, మున్నందుల గెల్చి పుష్పపురిఁ బొందెం జంద్రగుప్తుండు; కం
టునఁ గర్ణాటతఁ గాంచువారి మరలం ద్రుంపన్ భుజాదర్పమం
దనుఁ డాశ్రీమహీపాలదేవుఁ డతఁడైనాఁ డిప్డు నిక్కంబుగన్.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఆర్యా! అమ్మహారాజు నాదేశ మేమి!

సూత్ర—సుప్రసిద్ధం డగువిజయప్రకోష్ఠునిప్రపౌత్రుం డార్యక్షేమేశ్వరకవి నవీనముగా విరచించినచండకౌశికనాటకముం బ్రయోగించుమని యని—అమ్మహాకవి నాట్యవేదవిశారదులును విద్యాకలావిదులును, లోకజ్ఞులు, నగుసభాసదులం గూర్చియిట్లుపలికియున్నాఁడు.

క. దోసము లేశము లేనివి
వీసంబు గుణంబు లేనివియు లే వెందున్;
దోసమును గప్పి పుచ్చుఁడు;
భాసిలఁ జేయుండు గుణముఁ బండితులారా.

కావునఁ బారిపార్శ్వకా! కుశీలవులతో సంగీతము నారంభింపవేమి!

పారి—(సాశంకముగాఁ దల వాంచుకొని) ఆర్యా! ఆలకింపుఁడు. నాఁడు గ్రహణకాలమున మీరు దక్షిణ యిచ్చెద నని మాటయిచ్చిన బ్రాహ్మణోత్తముఁడు తదర్థము నేఁ డరుగుదెంచి క్రోధపడుచున్నందునఁ గుశీలవు లందఱు వందురుచున్నారు.

సూత్ర—(భయము నభినయించి చింతను నటించి సహర్షముగా) మారిషా! ఈవిషయమున విషాదంపడ నేటికి? ఇదిగో నే నిప్డే—

ఆ. వె. ఆలిఁ జూలి నమ్మి యాత్మదేహము నమ్మి
సత్యపాలనంబు సలుపుపొంటె

నియ్యకొన్నవిత్త మిత్తు హరిశ్చంద్ర
పార్థివుండు వోలె బ్రాహ్మణునకు.

(తెరలో) వయస్యా! ఇటు, ఇటు,

సూత్ర — (తెరవంకఁ జూచి) ఓహో ఏమి! హరిశ్చంద్రమహారాజే మహోత్పాతసూచితంబు లగునాపదలు కుశలపరిణామంబులుగాఁ బ్రహ్మనిధిస్తరుం డగుపురోధసుండు రహస్యంబున నుపదేశించిన నియమజాగరంబులం బావరించి పర్యాకులమానసుం డగుతనకుం బ్రియవయస్యుండు బోధాయనుండు దారి చూప నంతిపురము వైపున కిటు బయలు వెడలినవాఁడు, చూడు—

చ. భర మగుతూఁగుచేఁ దొగరుపాఱినసోమరికన్నులం, బ్రజా
గరమున వాడుదేరుముఖకంజమునన్, విభుఁ డీతఁ డొప్పెడున్,
మరగినయాత్మయాధమును మాపటివేళను బాసి, రేపటన్
విరహకృశానుకీలలను వేఁగుమహాగజరాజమో యనన్.

కావున నక్కడకే పోదము రా. (నిష్క్రమించుచున్నారు) (ప్రస్తావన

(తరువాత జాగరఖేదము నభినయించుచు రాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు)

విదూ — చెలికాఁడా! జాగారవుబడలిక గలకన్నులతో నీవుదీర్ఘముఖం బగుతాఁబేలునుంబోలె నున్మేషనిమేషంబులం గావించుచున్నను దారి గానక గుడ్డియెలుకలాగున నిటునటుఁ బరిభ్రమించుచున్నావు.

రాజు — మిత్రుఁడా! ప్రాణులకు శరీరధారణవిషయంబునం బ్రథమ కారణము నిద్రయే గదా!

ఉ. చిత్తముఁ దేఱుచుం; జులుకఁ జేయు సమస్తము లైన యంగముల్;
గ్రొత్త వికాసముం బ్రతిభకుం గలిగించుఁ; దొలంచు దోషముల్

బొత్తిగ, ధాతు సామ్యమును బొందఁగఁ జేయును; వేయునేటికి
త్యుత్తమయోగగమ్యసుఖ మొక్కటిఁ గూర్చును నిద్ర యుబ్బమే?
అందుచేతనే చూడు నాకిప్పుడు—

ఉ. నిద్దురబడ్డకంబునను నెమ్మొగ మొక్కట విఱుపావహిల్లెడిన్
దద్దయు; ఖేదభారముకతంబునఁ బ్రస్తుతమైనంబు చిత్తమున్;
బద్దగ నావులింతలు జనించెడు మోమున సారెసారెకున్;
బ్రొద్దుటి లేఁత యెండపొలుపుం గనఁ జైఁపదు చూపు లేశమున్.

(ఆలోచించి విస్మయముతో) ఇప్పు డీనిశాప్రజాగరవ్రత మాచరించుటకుఁ బూజ్యులగు కులపతులయభిప్రాయ మేమైయుండునో? ఏమయిన నేమి? గురుశాసనములు విమర్శనార్హంబులు గావు.

విదూ—చెలికాఁడా! నే నాలోచించిచూడఁగా వాసకసజ్జిక యగు దేవి ఖండిత యయ్యె ననునర్థము దక్క వేఱొక్కటి యీవ్రతమునకుఁ బ్రయోజనము గానరాకున్నది.

రాజ—మిత్రుఁడా! నీపరియాచకములు మానుము.

విదూ—అయ్యా! నీ కిది పరియాచకము గాని యనాథవటువను నాకు మహానర్థము.

రాజు—(సోత్కంఠముగా భయమును నటించుచు) మిత్రుఁడా! దేవి యేమిచేయు నని నీ వనుకొనుచున్నావు?

విదూ—చెలికాఁడా! నిశ్చయముగా నామె కోపముచేయునని యూహించుచున్నాను.

రాజు—మిత్రుఁడా! అది తప్పు. అందుకు సందేహ మేమి? దేవికిది సామాన్య కోపకారణము గాదు చూడు.

ఉ. మంతును లాఁగిరో, హితసమాజము గోష్ఠికిఁ జొక్కి నిల్చెనో,
కాంతుఁడు, వేఱొకర్తు ననుఁ గాదని కూడెనొ, కాఁడు ధూర్తుఁడే,

యింతకుఁ బంచుఁ గినుక నెలు పెక్కినకన్నుల జాలువారి మో
మంతయుఁ దోఁగ నూర్చి ప్రియురాలిఁక నే మనుకొందు నక్కటా

మఱియు

చ. చెలియయొ యూర మొప్పఁగ యిసేయుత మిన్ను నిమాపుపుచ్చి, యా
వలి దగుజాము నా తెరువుపైఁ గను లుంచుక వెళ్ళఁబుచ్చి, య
వ్వేళ నిఁక రాఁడు ధూర్తుఁ డని, బాష్పములూర వగన్ సడల్చిసా
మ్ములఁ, గోలరేయి యెట్లో గడపుం బెడపాన్పునఁ బొర్లుచున్ సఖా

(చింతించి) మిత్రుఁడా! నిశ్చయముగా నీలాగున జరుగును. ఎట్లనఁగా

చ. ఉవిద మదాగమాశ యయియుండఁగ రానె వరేని, దావృథా
యవిరళసంభ్రమోద్గమన మైనఁ, జెలంగు మలుంగుగా, సఖుల్
సవనవఁ గాంచి యెంతో డొరుఁ, జప్పుడొనర్పక లోన నవ్వఁగో,
నవ్వదల నెత్తి నోడు బిడియంపడి యాబిడ వారిముంగడన్.

విదూ — చెలికాఁడా! కడచినదానికి వగచుట యేల యాయాసపడి
యెదవు? లే లెమ్ము. మన మక్కడకే పోయి దేవిని బ్రసన్ను
రాలిని జేసికొందము.

రాజు — (సశ్లాఘముగా) ఓయీ! నీవు బాగుగాఁ బలికితివి. రమ్ము
మన మక్కడకే పోవుదము. (నడచుచున్నారు)

రాజు — (ఖేదముతో నిట్టూర్పు విడిచి) మిత్రుఁడా! తటి తప్పాటను
బట్టి యిప్పుడు పోవుట నాకు ఖేదకారణము.

చ. ఎడపడునాకథం దిరిగి యెత్తుక, నే నరుదెంచుదాఁకఁ గ
న్నిడుకొని, గడ్డిపోఁచ చలియించిన నన్నుఁగ నెంచు కల్కి, యె
క్కడ నిభృతంబుగా నరిగి కానక యుండఁగఁ గవుంగిలింపఁ; బ్రే
ముడి విరినల్లగల్వలను బోలెడుకన్నులు మూయఁ జేతులన్.

విదూ—(నడచి తెరవంకఁ జూచి సశ్లాఘముగా) ఓహో! చెలికాఁడా చూడు చూడు. అలంకరణోపకరణంబులం గొనివచ్చెడు చారుమతితోఁ బ్రవేశించి యిదిగో దేవి యిక్కడ నున్నది.

రాజు—(చూచి సంతోషముతో) ఆహా! ఏమీ!

చ. చెలి శరగౌరపుం దళుకుఁ జెక్కులఁ గూర్పదు పత్రభంగి; వీ
నులఁ గడ క్రొత్తవాలికకనుంగవఁ దీర్పదు కజ్జలంబు; వే
నలి కుటిలంబు వ్రేలు; నరుణం బధరం బగు ధూసరం; బిటుల్
పాలిచినఁ దొంటి దేసుషమ; భూషణముం బగ సేయు నాఁదగున్.

(తరువాత ముందు చెప్పినట్లు చింతను నటించుచు శైబ్యయుఁ జారుమతియుఁ బ్రవేశించుచున్నారు.)

చారు—దేవీ! ఇదిగోఁ బ్రసాధనోపకరణము.

శైబ్య—(ఖేదముతో) ఓసీ! చారుమతీ! యిక్కడ నివి తీసివేయుము. నన్ను నే నెందాఁకఁ బరాభవించుకొందును? నాహృదయమునకీయలంకరణోపకరణాసక్తి నిరర్థకము.

విదూ—అబ్బో! ఈమెది గట్టిపట్టే.

రాజు—బాగు! దేవీ! బాగు! నిసర్గమనోహరంబు లయినసీయవయవంబులకుఁ బ్రసాధనోద్దేశము నిజముగాఁ బరాభవస్థానమే; చూడుము.

మ. తరుణీ! నీజిగిమోవి కాశపడెడుం దాంబూలరాగంబు; సు
దరి! కందోయిని ముద్దుఁ బెట్టుకొన నుత్సాహంపడుం గజ్జలం;
బురువక్షోరుహా! కౌఁగిలించుకొనఁగా నూహించు హారంబు కం
ధర; యేకేటికి భూషణంబు లివి స్వార్థం బాశ్రయించు న్నినున్.

విదూ—మిత్రుఁడా! మనము సమీపింతము.

రాజు—చెలికాఁడా! మన మిక్కడ దాఁగి యుండి వీరివిస్రంభసంభాషణ మాలకింతము. (అట్లే చేయుచున్నారు.)

శైబ్య - చేటీ ! చారుమతీ ! అవ్విధమున నూఱడించియు మరల నన్నార్యపుత్రుఁడు విప్రలంభగోచరం గావించెనుగదా! సర్వథా నాభాగధేయంబు లవిశ్వసనీయంబులు. వాని కిఁకఁ బదివేల నమస్కారములు.

రాజు—ఓమనస్విని !

క. ఘనపటలాంతరితుండుగా
నినుఁ, డబ్జిని మోము ముడువ, నేమి యుపాలం
భిన మయ్యెడు నయ్యది యో
యన? కెట్టులు విప్రలంభ మది పద్మినికిన్ ?.

చేటి—దేవి ! నీవిచారము మానుము. రాజులు బహుభార్యలుగదా!

విదూ—ఆ! బాసనహారాలురా ! బహుకార్యులని చెప్పుము. ప్రియమిత్రునంతరక యుపద్రవాలు చేసెద వేల ?

రాజు—చెలికాఁడా ! దీనిమీఁదఁ గోపపడకుము.

క. సమయముఁ గని సఖులకదం
బము బిగితము సేయు చుండ మానగ్రంథిన్,
రమణులమిథోవ్యపాలం
భమునకుఁ బాత్రక లభించు బహుపుణ్యనకుక్.

శైబ్య—(ఏడ్చుచున్నది.)

చేటి—దేవీ ! ఊఱడిల్లు మూఱడిల్లుము. అతిమాత్రమైనయమాయికత్వముచేత నీవే మహారాజును మీఱఁ బెట్టినదానవు. అమ్మా! నీ విప్పుడు నన్నడిగితివా విను. ఆయన నిన్నుఁ జూచినను నీవాయనను జూడకుము. ఆయన నిన్నెంత మంచిమంచి మాటలతో బతిమాలుకొన్నను దడవుగ నీవుల్లసము లాడి యాయనను ఖేద పెట్టుము.

శైబ్య—ఆర్యపుత్రుఁ జూడఁ గలప్పుడె నాదు మనస్సునఁ బూఁద నా యధికారము సాగింపఁదగిన నియమము నీవు చెప్పినట్లే తప్పక జరిగించెదనే.

రాజు—(త్వరగా సమీపించి) ప్రియురాలా!

క. నీ కేనెప్పుడు విధేయుఁడ
నే కద; మత్పరత నున్న నీడెందముపై
నీ కేమిట నధికారం
బో కంజదళాక్షి! సాగ కుండును? జెపుమా.

విదూ—దేవీ! శుభము.

(ఇద్దఱును సంభ్రమముతో నిలుచున్నారు.)

శైబ్య—(తనలో) ఓహో! ఆర్యపుత్రుఁడే! కానీ. (ప్రకాశముగా) జయము జయము ప్రాణేశ్వర!

చేటి—(భయముతోఁ దనలో) అయ్యో! మహారాజే! నేనన్న మాట లీయన చెవిని బడి యుండును. కానీ. (ప్రకాశముగా) జయము జయము మహారాజ! దేవా! ఇదిగోఁ బీఠము. దేవర యిందుఁ గూర్చుండుఁడు.

(అందఱుఁ గూర్చున్నారు.)

రాజు—(కడుఁదడవు దేవివంక విలోకించి) సుందరీ! ఇదిగో నిస్వాదు--

చ. దగఁగొని వేగుఁబోక విరిదమ్మిని దుమ్మెద గ్రమ్మ వ్రేలఁగా
నెగయు తెఱంగునన్, జిగి నీనిక గ్రాలు కదృగంచలంబుతో
సొగసుగ నాపయిం బొలయు చూపు గిలుక్కున గ్రమ్మఱించి; తే
మగపడెఁ దన్వి! నా యెడ దయన్ నిగ్రహించెదు నేర మింతలా?

మఱియు నో మనోహారిణి!

క. నగలు ననాదరణమున ని
వగపఱచినఁ గొదవ యొదవ దభిరామతకున్

జగి. మేనఁ; గాం నాకది
మఘవా! ప్రకటించు నీదు మదిమానికితమున్.

శైబ్య — దాలసంబులైన యీయవయవంబులతోడను బ్రజాగర మంథరంబులైన యీశోణ నేత్రంబులతోడను దేవరవారు మిక్కిలి చక్కగాఁ గనఁబడుచున్నారుగదా! నామాట కేమి? (కోపము నటించుచున్నది.)

రాజు — (తడవుగఁ దేఱిచూచి) ప్రియురాలా! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

చ. మదనజయధ్వజంబు సుమనస్సగువక్రపుబొమ్మతీఁగ నీ
నుదుట నదేల తాండవవినోదము సల్పుచు నుండెఁ జండికా!
మృదుపవమానకంపిత పరిస్ఫుట బంధుక బాంధవంబుగా
నదరఁజేతు నేల నీ కసమయంబున నిట్లధరోష్ఠబింబమున్.

(దోసిలిపట్టి)

ఉ. కమ్మప్రసన్నపూరకలుకల్ వహియించెద వేల కోపనా
యెమ్మెయి నెంచితీవు నను నే నటుగా నిది నమ్మవేని దం
డమ్ము విధింపు పోలినటు నాతుగుణాగుణనిర్ణయమ్ముఁ ద్రం
డు మ్మహనీయు లాకులపతుల్ బలితంపుఁబ్రమాణమయ్యెదర్

(ప్రతీహారి ప్రవేశించి)

ప్రతీ — జయము జయము మహారాజ! ఇదిగోఁ గులపతులసన్నిధినుండి యొక తాపసుఁడు వచ్చియున్నాఁడు.

రాజు — హేమప్రభా! ఆలసింపక సాదరముగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ — దేవా! చిత్తము చిత్తము. (నిష్క్రమించెను.)

(తరువాత శాంత్యుదకమును జేతఁ బట్టుకొని తాపసుఁడు
ప్రవేశించుచున్నాఁడు)

తాప — (విస్మయముతో) ఓహోహో!

సీ. ఇదియేమి యాశ్చర్య మిందుబింబము మ్రింగెఁ
పర్వంబుగాకె స్వర్భానుఁడొడిసి

యేమొ మహాఘోర భూదశావలయంబు
కాపురుష గ్రస్తంగఁ గాలఁదొడఁగె
ఛిద్ద్వారమేమొ వెసఁదొంతులు వోలెఁ
బ్రహ్మసౌధములుగూలఁ బృథివి యూఁగు
నెగసి యుల్కాపిండ మేమిట్టు ఖండించె
రెండుగా మార్తాండమండలంబు
దారుణోత్పాతములు గదా తలఁప నిన్ని
గంచుదివియల వెదకిఁ గఁకరంబు
గాన్కఁగారానిహతవిధికపట మకట
యేమి మూఁడింప నున్నదో యింకమీఁద

అయినను గురుజనులపరామరిక వలన నివి యన్నియుఁ గుశలపరిణామములే కాఁగలవు.

తే. గీ. శాంతివచనను బ్రాహ్మణస్వస్తివాచ
నంబువలనను స్వస్త్యయనంబువలన
దానమున సజ్జనానుకీర్తనమువలన
క్షమ మహోత్పాతదుస్స్వప్నశమన మగును

అందుచేతనే మహానుభావులు ఋషికులపతులు సర్వోత్పాతప్రశమనంబుగా నిజారబ్ధస్వస్త్యయనకర్మశేషభూతం బగునీ శాంత్యుదకమును రాజునకును రాణికిని నిచ్చి రమ్మని నన్నంపినారు.

ప్రతీ—(ప్రవేశించి) అయ్యా! ఇటు ఇటు. (సమీపించుచున్నారు)
తాప—(సమీపించి) రాజా! నీకు శుభము.
రాజు—(తొందరగా లేచి) స్వామీ! నమస్కరించుచున్నాను.
శైబ్య—మునీంద్రా! ప్రణమిల్లుచున్నాను.
తాప—రాజా! జయశాలివి గమ్ము. సాధ్వీ! వీరమాతవు గమ్ము.

రాజు—(తొందరగా) పీఠము. పీఠము.

ప్రతీ—(పీఠము గొని వచ్చుచున్నది)

రాజు—స్వామీ! ఇదిగో పీఠము. కూరుచుండుఁడు.

(అందఱుఁ గూరుచున్నారు.)

రాజు—హేమప్రభా! నీవు ద్వారము కడ నుండుము.

ప్రతీ—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నది)

తాప—రాజా! మహాత్ములయిన కులపతులు తమ యాశీస్సువలన నుత్కృష్టప్రభావ సంపన్నంబు గావించి శిష్యప్రజాగరాంతంబునఁ గాంతాసహితంబుగా నీవు శిరస్సునఁ జల్లుకొనుటకు స్వస్త్యయన శేషము శాంత్యుదకము నంపినారు.

రాజు—(హర్షముతో దోసిలిపట్టి) మహాప్రసాదము.

తాప—

మ. శమితాంహశ్చయమంత్రపూతముసుబుష్యత్యుగ్ర తేజోనలం
బమితప్రోన్ముఖసర్వపచ్ఛమనసంప్రారబ్ధసత్కర్మశే
షమనిర్వాచ్యమహత్త్వమీయుదక మైశ్వర్యంబు నీ కిచ్చుడున్
బ్రమదంబుం బాలించుఁగాత మఖిలార్తుల్ వారించుచున్.

(శిరస్సునఁ జల్లుకొనుచున్నాఁడు.)

రాజు—(స్పర్శము నభినయించి) ఆహాహా!

క. అలఘుతపోబీజమునకుం
గలుగం బ్రసవాంకురంబు కారణ మిది, నే
వెలుఁగుఁగొలముతోం జెలుగఁ
దల దీపప్రసాదమునఁ గదా మెత్తిరిలన్.

తాప—పూజ్యరాలా! శైబ్యా! కులగురుల యాదేశంబున గృహదేవతలకును భూదేవతలకును సవిశేషముగా నీవును సమారాధనముల జరపవలయు.

శైబ్య—(దోసిలి పట్టి) స్వామీ! చిత్తము.

తాప—రాజా! నీకు శుభమవుఁగాక. నేను ప్రారబ్ధవివిధవిధివిస్తరు లగుకులపతులసంభావింప నరుగుచున్నాఁడ (నిష్క్రమించుచున్నాఁడు)

శైబ్య—(వైలక్ష్యముతో) ఓసీ చాటుమతికా! ఆర్యపుత్రునకు నిశాప్రజాగరము మహానుభావులు కులపతులే యాదేశించిరి. అయ్యో! సమ్మతము లేని యీ పాడుపనను నన్నెంత దురాత్మురాలిఁ జేసినదే. కాని. ఈలాగు చేసెదను (దోసిలిపట్టి ప్రకాశముగా) ఆర్యపుత్రులు నన్ననుగ్రహింతురుగాక.

రాజు—(అనురాగముతో) ప్రేయసీ!

ఉ. చెన్నటిచిత్రపుష్పదానఁ గలుషీకృతచిత్తుఁడ నయ్యు నే నో
యన్నులమిన్న! నీ మనుపయం బిది గ్రాహ్యము యందువే నీ
ప్రన్ననిచెక్కుటద్దములఁ బత్రములన్ రచియింతు ముత్తెపుం
బన్నసరంబుఁ గింబుసుమమం బగు కంఠమునన్ ఘటింతునున్.

శైబ్య—(సిగ్గు పడుచున్నది.)

రాజు—(అట్లుచేయుచు) ప్రియురాలా!

చ. చెఱుగగుర్పు నీకు జిగిచెక్కుల, నాకు వడంకు గేలు నే
క్రమమున వ్రాయ నేమకరికల్? సకలంబు వృథాశ్రమంబు హో
రను మెడఁ గూర్పఁగా నది తరంగిత మౌచుఁ గుచాగ్రసీమఁ గం
పమును మదీయహస్తసహవాసభవంబును మాన దుగ్మలీ.

శైబ్య—ఆర్యపుత్ర! కులపతు లానతిచ్చినట్టు లాచరింపఁ బోవుచున్నదానను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

రాజు—మిత్రుఁడా! సోత్కంఠుఁడ నైననే నేలాగునఁ బ్రొద్దుపుత్తును?

విదూ—చెలికాఁడా! నీవు నేవిమాటలను జెప్పుకొనుచు సంతోషింపుము. నేనును భోజనప్రసంగముతోఁ గాలము పుత్తును.

వనచరుఁడు—(ప్రవేశించి) జే జే దేవరా! అవధారు సామీ! బెట్టిదపుమిట్టిముట్టకొనం బిట్టు గోడాడుత్తుంగిపట్టులం బుట్టిననెత్తావి వెల్లువపొత్తుం బెల్లువలచునూర్పుగద్దులం దంతయంత్రాంతరదరచర్విత మూఁణంబు లగుతెల్లనికొట్టిగడ్డలపిండి యిట్టట్టుఁ జెదరి విప్రకీర్ణప్రతిపక్షజమూ పార్శ్వజయుశగిపటలంబునుం బోలెఁ గాలమేఘ బునం గురుయుకర వర్షంబునుం బోలె దశదిశాభాగంబులం గప్పఁ బెద్దకాలంబునుండి మొదుకొనియున్న వేరంపుఁగారణంబునం జేసి రోసంబునం బూర్ణ శాంక మండలంబునుండి నింపు బలిమిం గళామముశంబుఁ బొలి చుకబళించెనుతునదిరేయిటికటి కిచీఁకటిమొత్తమునుంబోలె దశనాంత రాళఖడనభయాస్తుండలాయితమృణాళదండ భాసురకరాళవికటదంష్ట్రయుగళంబున ముఖమండలంబు దీప్రడింప, నేసారుకోపానలంబుసిగయునుంబోలెఁ దరలతరజిహ్వాప్రవాళంబు గాప్రు విదారితవనసింహసంహతి యగునిజగర్వగంభీరఘుర్ఘురారావంబునం బెదరి తమతమజాతి కనుగుణంబుగా వాపోవు నాభీలశార్దూలాది వ్యాళజాలంబులకోలాహలం బాలకించియాగ్రహించి చిక్కించి ఎక్కర్దన్న నుంబు ముత్తిముపుఁజిప్పరోయిం జప్పటలు సఱువరూక్షతరపింగాక్షివిక్షేపం బగునిశితకరవాలవిమలేందనీలకజ్జలతమాలశ్యామలస్థూలకాయంబు స్ఫులింగశేషం బగుదవదహనమషీరాశినీసడింప, వికటనటిచ్ఛటాకడారకేసకకలాపంబున నిరంతరపరిస్ఫుర ద్వనలగ్నదావానలోద్గారభాస్వరం బయి యవతారితధరావలయలీలానమున్నతం బగుమహావరాహంబునుం బోలె నొకవరాహయూథాధిపతి మృగవ్యభూమిని బ్రవేశించెను. అవధరించి దేవర చిత్తానుసార మాచరింపుఁడు నేను నక్కడకే పోవుచున్నాను.

రాజు—(సంతోషముతో) ఆహా! నాకిప్పుడు వినోదస్థానము లభించినది.

విదూ—(కోపముతో) ఓహో! చెలికాఁడా! ముల్లుకంపలలోను తెల్లునబ్బులలోనుబడి మిఱ్ఱుపల్లంబు లనక యాఁకలిదప్పులకు లోఁగుచు నడవులలోఁ దిరుగులాడవలయుటం బట్టి బహుప్రత్యవాయంబు నాఁ జనువేటయే నీకు వేడుక యట్టి యొపక్షమున నీకు లోకములో నాయాసస్థాన మేది యుండును ?

రాజు—మిత్రుఁడా! రాజులకు వేఁట యత్యంతోపకారకము గదా!

చూడు—

చ. అలఁదురుమానసంబునకు హాయి ఘటించుఁ; జలించులక్ష్యమున్
దలపఱుచున్ స్థిరత్వ మఖిలాంగము లాఘవ మొందఁజేయు నె
క్కొలుపుఁ గడంక బుద్ధిఁ; గలఁకుంబలె నెంతయు మోహమింతయుం
దలఁపక వేఁట నందు వ్యసనం బిది రాజులకుం దగుఁ బండితుల్.

కాఁబట్టి రామన మక్కడకే పోవుదము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

—: గద్య :—

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధు
వంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్ఛ నామాత్యపౌత్ర హరి
తసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిము
క్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీ
కృతం బగు చండకౌశిక
నాటకంబునందు
ప్రథమాంకము.

శ్రీ పరమాత్మనే నమః.

# చండకౌశికనాటకము

## ద్వితీయాంకము.

[తెరలో] ఓహో వరాహాన్వేషులారా!

మహాస్రగ్ధర.

కలఁచుం బంకంబుఁ, ద్రెంచుం గమలిని, నములుం గందళమ్ముస్తకంబుల్,
జలమీఁదుం గూలనొడ్డుల్, స్ఫుటములుగ వస్రాస్థలుల్ సల్పుఁ, దూటెం
బలుగోనం, దక్కెడకెక్కెం, బఱచుఁ బఱచు, వేథల్లముల్ చిమ్ముఁడంచుం
బలముల్ వెన్నాడి గాలింపఁగఁ జోరఁబడెడుం బదికాంతారభూమిన్.

కాఁబట్టి యడవుల నెల్ల నరికట్టవలయును.

సీ. గహనావరోధధూర్వహజాలికులు జాల
బంధంబులను బూంటఁ బన్నవలయు
భషకసంఘులు వనాభ్యంతరంబున జాగిల
ముల పట్టెడ లెడల్పంగవలయు
నలయు వాజులు వనస్థలము లెల్లను బాళి
పస్తులు రాహుత్తులలమవలయు
దండముల్ ప్రానుదుంతలరౌతు లంతకల్
బలెంగాన గజిబిజింపంగవలయు

మందరాచలమంథానమథ్యమాన
కలశపాథోనిధానంబు దలఁపు రాఁగ
నధికవనసత్వ సంక్షోభమావహిల్ల
ధీరబుద్ధకవారంబు దిరుగవలయు. ౨

[తరువాత కాద్రోజ్వలవేషుండయి సంభ్రమించుచు
విఘ్నరాట్టు ప్రవేశించుచున్నాఁడు.]

విఘ్న--(సాశంకముగాఁ దనలో)

చ. హరునిసమాధికిన్ శివునకుంగజకేళికి దక్షుసల్పిన
ధ్వరమున కంతరాయము నెవండు ఘటించె, జగత్త్రయిన్ నిరం
తరము సమాచరించెడుహితవ్యవసాయపుఁబంట మాపుటే
పరమవిలాసమై యెవఁడు భాసిలు, నేనలవిఘ్నుఁడంగదా. 3

కావున నే నిప్పుడు—

చ. జలజజశార్ఙ్గిశంభులయసాధ్యపువిద్యలు మూఁడు నగ్రపుం
బలువ్రతపఃఫలంబడయు వాఁడగుతాపసుమౌని ముజ్జగం
బులను సముద్ధరింతుఁ గిటిమూర్తిని క్రీడమెయిం ధరించు ధర్
బ్రలయమునందు నాదివరాహతనుండు ముకుందుఁడుం బలెన్. ౪

అట్లు చేయుట యుక్తమేకదా!

చ. భువనములన్ విధాత సృజియింపన్, హరిగాఁడు హరుండుగాఁడు; కే
శవుఁడు భరించు గోత్రయవి, శంభుఁడుగాఁడు విరించి గాఁడుమా
ధవుఁడు హరించు హర్త యవి, ధాతృఁడు గాఁడు విధుండుగాఁడసం
భవమగుఁగాక యొక్కఁడొకఁడట్టిన నెట్లఖిలంబు సిద్ధియౌ. ౫

(ఆలోచించి) అయినను బరమనైష్ఠికుఁ డగు నీతని యందసంభావ్య
మొకటి యుండదుగాని మునిస్వభావంబులు సులభకోపంబు లని
యుఁ గామక్రోధంబులు శ్రేయఃపరిపంథు లనియు నిక్కార్యంబు
నకుఁ గడంగితిని. ఫలిత మెట్లుండునో యెఱుంగఁజాల.

[తెరలో] అతినిబిడవనాంతర్ధానగర్వితా! వరాహాధమా! ఉండుండు.

చ. కనఁబడుచుం నిమేషమునఁ గన్మొఱంగుచునో పిశాచి! మా
యను గయికొన్న చందమున నక్కట! నన్నలయించి దవ్వుగాఁ
గాని చనుదెంచి తేలనుడుగుల్ వెయి? నీ విపు డింత నాదుకం
టను బడి తేని దామరవనంబుల నింకిటఁ దుఱింప వెన్నఁడున్. ౬

విఘ్న—(విని హర్షముతో) ఓహో! ఇతఁడు సమీపించెనే. నే నిపు
డీలాగునఁ బోయి యెప్పటిమాయనే యవలంబించి కనఁబడియెదను.

(సత్వరముగా నడచి నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత విల్లుపూని వెంబడించుట నభినయించుచు రథమెక్కి
రాజును సారథియుఁ బ్రవేశించుచున్నారు.)

రాజు—(“కనఁబడుచున్ నిమేషమున” అను పూర్వోక్తపద్యము
పఠించుచు ముందుచూచి సంతోషముతో) ఆర్యా! ఆర్యా!
వరాహము మనకుఁ జేరువనున్నట్లే తోఁచుచున్నది—చూడుము.

చ. సమలుతజిం దొరంగుకవణంపుబిసంబులు గప్పె నేవన
క్షమను గలంగి పాఱునుదకంబులధార లివే సరస్తటిన్,
శ్రమగళితోరు ఫేనముల శాద్వలముల్ శబలంబు లైదు, సాం
ద్రము ధృతమస్తసౌరభము తచ్ఛ్వసితంబుల మారుతం బిటన్.

(మరల నిపుణముగాఁ జూచి సంతసముతో) ఆర్య! ఆర్య! ఇదిగో
నది, చూడుము చూడుము.

ఉ. జోక మెడం గదల్చి కొనుచున్ వెనఁ ద్రివ్విదుంపతోడి ప
ర్యాకులలోలనాలవికచాబ్జము నోరను బూని, యో నిగూ
ఢాకృతి యైననాభినల మానసపద్మముఁ జేర గాండి దం
ష్ట్రాకలితక్షమోద్ధృతిని గ్రిలుమహాకిటి నాఁడ దర్పెడున్.

సూతు—(సకౌతుకముగా విలోకించి) ఆయుష్మంతుఁడా! చూడుము
చూడుము

మ. తిరుగం గ్రీవ్వన వచ్చి లక్ష్యమయి భీతిం దోన వెన్దిసి ముం
దఱిపాదంబులు సాఁచి, కాంచుచరమార్గం బీక్షుచున్ ముందుకున్
ద్వారితశ్వాసవిదీర్ణసృక్వవివరభ్రశ్యద్బిసాంకూర మా
విరిగోఱం దరిసించు నీ కన గతవ్రీడావిలక్షాస్యమై.

రాజు—(బాణమోక్షణమును నటించుచు సమీపించి యంతటఁ జూచి యాశ్చర్యముతో) అయ్యో! యీనిమేషముననే మాయమై పోయినదీనిమీఁద ననవసరమున బాణమోక్షణము గావించితినే.

చ. కను మొఱఁగుఁ క్షణంబు, క్షణకాలము దృగ్విషయంబగుఁ, మఱిన్
జనుఁ గడుదవ్వుగా, మరల సన్నిధి నుండుఁ జరించుఁ, గ్రమ్మఱన్
వెనుకను బ్రిక్క నంతటను వెండి భ్రమించు; మెఱుంగువోలె ని
ల్వని దగుదీని నెక్కరణి లక్ష్యమొనర్తునొ తోఁప దేమియున్.

(నిపుణముగా నరసి దూరము చూచి యానందముతో)
ఓహో! వరాహ మీమహారణ్య మతిక్రమించి పరిసన్న భూమి నధిరోహించినది. ఆర్య, ఆర్య! గుఱ్ఱములను వేగముగాఁ దోలుము. ఇఁక నిది యెందుఁ బోఁగలదు?

సూతు—(అట్లు చేసి రథవేగము నభినయించి) ఆయుష్మంతుఁడా! చూడు చూడు.

చ. వెనుకను బెందుదూరమున వీచెడుగాలిని మీఱుచున్ వడిన్,
మునుమున లక్ష్యముం గలయఁబోయెడునామది వెన్నడించుచున్
దనయచలధ్వజాంశుకము దాఁకఁ బయోదము నీశరాళితో
డను నరి గాఁగ నయ్యెయెడన్ భవదీయరథంబు వ్రాలెడున్

రాజు—(విస్మయముతో) ఏమిది!

చ. చదలఁ జరించుచుం బవనజైత్రజవంబున నంబురాశి గో
ష్పదముగఁ జౌకళించురథవాజులతోఁ దనుఁ గూడ ముట్టునా

కదర ! విభిన్నకజ్జలచం   సూనవినీలకాయ మీ
కోదమవరాహ మర్గమునకుం దమపొట్టులు దూరదూర మౌ.

(ముందుచూచి ఖేదముతో) అయ్యో ! యీమహారణ్యము నతిక్ర
మించి వెంటనే యదృశ్యం బయినదీని యడుగులజాడ యయినను
గానరాకున్నది. కానీ, ఇదిగో నెట్టయెదుటఁ దిన్నగా నున్నయీ
యరణ్యరేఖ నిప్పుడన్వేషించెదను. (అట్లు చేయుచు సంతోష
ముతో) ఓహో ! యిది తపోవనోపకంఠము గావలయును. నిశ్చ
యము మే.

చ. ఒకయెడ వేళ్ళతోఁ బెఱికి రొక్కఁడఁ గోసిరి దర్భబీళ్ళు; పూ
లకు దయఁ జందుకో రివటలన్ లతలిం దిసుమంత వంగె; నొ
ల్చికొనుటఁ జేసి వల్కలముఁ జెట్లిట గాయుపడెన్; దొరంగుపాల
పక్రికట మొనర్చు నీతరువరంబుల నిప్పుడె తుఱ్ఱించు టిధ్మముల్.

(అంతటఁ జూచి సంతోషముతో) ఆర్యా ! చూడు చూడు.

చ. చిలుకలు స్వాగతంబును వచింపఁ గదంబపుఁదొఱ్ఱలోదియన్;
దలఁపు హరించు ఘ్రాణమును దన్పుచు హవ్యసుగంధవాయువుల్;
జలపులినప్రదేశజకుశం బగుఁ ఝరతోయ మీకురం
గులు మనవంకఁ గన్గొనుచుఁ గోరిలు భయాతివిలోల దృష్టులన్.

సూతుఁడా! యాశ్రమోపాంతసంచారి యగునీవరాహము నిఁక వెదుకఁ
దగదు. నీవిప్పుడు గుఱ్ఱములను నీరు ద్రావించి విశ్రమింపం జేయు
ము. ఇంతలో నేను నాయుధమాత్రసహాయుఁడనై యాశ్రమము
నం బ్రవేశించి తపోధనుల కభివాదనంబు గావించి వచ్చెదను,
పూజ్యులకు సపర్య గావింపమి శ్రేయోవిఘాతంబుగదా !

సూతు—చిత్తము దేవా ! (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(చింతను నటించి సశ్లాఘముగా) ఆహా ! యే బెడఁదల నెఱుం

గమింజేసి యీజడదారుల మొంగబు లెంతరమణీయంబులై యొసం
గుచున్నవి !

మ. గతసంకల్పతఁ గోరఁబోదు మది భోగంబుల్; మమత్వంబు వ
ర్జితమై యేగుటచే వియోగములపై స్నేహంబులున్ గావహం
కృతిఁ దూలించుట స్వాన్యభేద మనుమాటే లే దసర్వాచ్య మా
నతిశాంతిం ఘను లౌతపోధనులు సౌఖ్యశ్రీధనుల్ గదా.

(వినయముతో నడచి భయమభినయించి సాశంకముగా) అహో ! ఘోర మిది ! అవినయదురాలోకంబు లైనయీతపోవనంబు లపూర్వంబు లగుటంజేసి సాపరాధులకుంబోలె సాధ్వసముం గలిగించుచున్నవి. తేజస్సులలో సర్వాభిభావియు ననభిభవనీయంబును నగుతపోమయబ్రహ్మతేజం బనిర్వచనీయంబు గదా !

క. అడుగడుగున జడుపిడు నా
కడవి ప్రశాంతము మనోజ్ఞ మయ్యును, మెత్తం
బడు నెల్లతేజములు తమ
పొడమినకడ నిప్పు నీటిపొందునఁ బోలెన్.

(భయముతో నడచుచున్నాఁడు)

(తెరలో) ఆర్యులారా ! రక్షింపుఁడు రక్షింపుఁడు. ఏయపరాధము నెఱుంగని యనాథల మశరణ్యలము; అయ్యయ్యో ! యతిదారుణముగా నగ్నిహోత్రమునఁ ద్రోయఁబడుచున్నారము. మందభాగినులను మమ్ము రక్షింపుఁడు రక్షింపుఁడు

రాజు—(విని యవష్టంభముతో) ఓహోహో ! చేరువ నీవైపున భయార్తిం గూరిన యాఁడువారలదియుం బోలె నంగలార్పు వినవచ్చుచున్నది. (అచ్చెరువుతో) ఏమిది ! ఇది తపోవనమే. ఇటువంటి యనీతుల కిక్కడ సంభవ మెట్లు ? కానీ సమీపించెదను.

(అటు చేయుచున్నాఁడు)

[తెరలో దొంగటియుల్లి వినఁబడుచున్నది.]

రాజు—(విని సావష్టంభముగా) భయార్తుల కభయ మభయము.

(క్రోధముతో) హా!

ఉ. క్రూరుఁడనాత్మనీన మతిఘోరము నీఖలకర్మ మందవ
శ్చారి వనీవిరుద్ధము నృశంసము నెవ్వఁడొనర్చు, వాని నా
దోరసి గొంతుఁగోసి మెయి తున్కలుతున్కలు చేసి యుజ్జ్వల
ద్భైరవవహ్నికీలలను భస్మముగా నవియెల్ల వేల్చెదన్.

(నడచి తెరవంకఁ జూచి విస్మయముతో) ఓహో! యగ్నిహోత్రి
మధ్యంబున నాసనంబయి భయార్తత నంగలార్చుచు దివ్యరూపం
బునం జెజరిల్లునారీరత్నంబుతో సన్నిహితహోమసాధనుం డయి
యగ్నిశాలయం దున్నవీఁ డెవ్వఁ డయి యుండును? నిజముగా
వీఁడు తాపసవేషధారి యగుకొండొకపాషండుండు గావలయు.

(తరువాత హోమము నభినయించుచు విశ్వామిత్రుండును, య
థానిర్దిష్టముగా విద్యలును ప్రవేశించుచున్నారు)

విద్య—(సంభ్రమించుచుఁ బూర్వోక్తము పఠించుచున్నారు.)

విశ్వా—(ఆశ్చర్యముతో) ఓహో! యేమి చెపుమా.

ఉ. పూనె హవిస్సు మంత్రపరిపూత ముపాంశున నే నొసంగఁగా
నైనను గాఁడు లేశము హుతాశనుఁ డియ్యెడ దక్షిణార్చి; హా
చైనకి ప్రయా ప్రభావము సదిర! యొద్దను నేఁగుదెంచి రీ
చాసలు విద్య లైనను వశంపడ కుందురు నాకి దేమొకో.

(సమాధి నభినయించుచున్నాఁడు)

విద్య—(పూర్వోక్తము పఠించుచున్నారు)

రాజు—(సత్వరముగా సమీపించి) భయార్తుల కభయ మభయము.
అరే! దురాత్మ! పాషండాధమ! నిలు నిలు. ప్రచ్ఛన్నరాక్షి

సుండ వగు నీమాయాప్రపంచ మిదియేమి ?

ఉ. కేల వరాక్షమాల, తలఁ గెంజడలున్, మొల వల్కములున్, దప
శ్శాలుల దైనయీపరమశాంతపువాలక మేమి ? యోరిచం
డాల ! జుగుప్సితం బకరుణం బగు స్త్రీవధ, పాతకోత్సవో
ద్వేలమనం బిదే యనుభవింపుము కర్మఫలంబు నిప్పుడే.

విశ్వా—(సంవరణము నభినయించుచుఁ గ్రోధముతో)

మ. అసకృత్కర్ణకఠోరభర్త్సనమిషవ్యాఘట్టజుంటాంతర
ప్రసభక్షోభసమాధిభంజననభస్వద్భాస్వరదీప్తి నా
యాసదృక్క్రోధజజాతవేదుఁడు సమిత్త్వాప్తిన్ క్షయస్పర్శన
ప్రసరోద్యత్ప్రలయాగ్ని నాఁ ద్రిభువనగ్రాసేచ్ఛఁ డీగుతెన్.

విద్య—(సంతోషముతో) మాకుఁ బ్రియము, మాకుఁ బ్రియము.
జయము జయము హరిశ్చంద్రమహారాజ ! (నిష్క్రమించిరి)

విశ్వా—(చూచి క్రోధముతో) అహో ! యేమిది ! దురాత్ముఁ
డీహరిశ్చంద్రుఁడే మాకు శ్రేయోంతరాయుఁ డైనాఁడు. అరే,
క్షత్రియాధమ ! నిలు నిలు.

ఉత్సాహ. హరివి యగుదు గాక, చంద్రుఁ డగుదు గాక, చంద్రమా
ధరుఁడు హరుఁడె యగుదు గాకఁ దానికేమి మూఢ,యీ
పరమవిద్య లంతరింపఁబట్టి యిట్టిదంబు గ
నెరియు నాదుక్రోధవహ్ని కింధనంబు గావు రా.

ఓరోరి దురాత్మ !

శా. జాయాకేళిమయుండు భూతకరుణాశాంతుండు దా నయ్యుఁ గ్రి
డాయత్తాత్మసమాధిభంగవిరసాస్యభ్రూకుటీభీషణుం
డై యాకృష్టశరాసు మారుఁగని ఫాలాక్షుం డెటుల్ చేసెనో
చేయుం గౌశికుఁ డట్లె ని న్నిపుడు దృష్టిం గ్రోధభూయిష్ఠుఁ డై

రాజు—(సంభ్రమించుచుఁ దనలో) అయ్యో! ఏమిది! ఈయన భగవానుఁడు కౌశికుఁడా? వారు పూజ్యురాండ్రు విద్యలా? వారి సిద్ధికిఁ బాహ్యుఁడను నే నిమన కంతరాయ మైతిని గదా! నిజముగా నింధనప్రాయుఁడను నే నవివేకంబునం బ్రజ్వలచ్ఛిఖాకలాపం బగు జ్వలనంబును ద్రొక్కితిని.

విశ్వా—(క్రోధముతో)

చ. కడఁగిన సాధనం బిటు విఘాతము నొందుటఁ గ్రోధ మెచ్చి నా
కుడిచెయి గాంచు శాపమునకుం గడు వేగిరపాటు; నెన్నఁడో
విడిచిన దల్లజాతిఁ దలపెట్టుచుఁ దానును సాహసాంక మీ
యెడమకరంబు చాపమున కెంతయు నేఁడె యసియు నిత్తఱిన్.

(లేచుచున్నాఁడు)

రాజు—(భయముతో సమీపించి) స్వామీ! నమస్కరించుచున్నాను.

విశ్వా—(క్రోధ మభినయించుచున్నాఁడు)

రాజు—(పాదములం బడి) భగవానుఁడా! క్షమియింపుము క్షమియింపుము. స్త్రీజనార్తప్రలాపము నాలకించితుండ నయి యెఱుంగని వాఁడ నయిన నన్ను క్షమియింపం దగును.

విశ్వా—ఏమీ! "యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగు" ననెదవు గా; ఓరోరి క్షుద్ర! నన్నని యెఱుంగవు గా!

ఉ. జాతిస్వయంగ్రహంబున నెసంగిన దుర్లలితైక విప్రుఁడన్
బోతరపున్వసిష్ఠముని పుత్రులకానను వీతిహోత్రుఁడన్
నూతనసర్జనోద్యమ వినోదనభీతజగత్ప్రశాంతుఁడన్
ఖ్యాతమకుంగయాజకుఁడ గౌశికుఁడన్ నను నీ వెఱుంగవా.

రాజు—తాపసోత్తమా! ప్రసన్నుఁడ వగుము ప్రసన్నుఁడ వగుము స్వామీ! నీ వీలాగున ననుకోఁ దగునా?

ఉ. అన్నము లేక కాటకమునం దటు జీవిక గన్నవాని, భూ
భృన్నివహప్రతిగ్రహణవృత్తికిఁ జిత్తము రోయువాని, సో
సన్నుతకీర్తి! యాడిబకసంగరకంపితజీవలోకునిన్
నిన్ను మహాత్మ! పోఁడిమి నేల నెఱుంగనివాఁడు గల్గునే

భీరుజనార్తవిలాపంబు నాలకించి యాలాగునఁ గావించితిని. స్వధర్మశిక్షితచేతసుండనయి యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగునని విన్నవించుకొనుచున్నాను. మహానుభావ!

విశ్వ—ఏమీ! "స్వధర్మశిక్షితచేతసుండవా? దురాత్మా! చెప్పు చెప్పు ఏదో నీధర్మము?

రాజు—మునికులోత్తమ! మనవి చేసికొనుచున్నాను. చిత్తగింపుము.

క. ఈయంగవలయు రక్షణ
సేయంగనువలయు, రణము సేయఁగవలయున్;
రాయులకు నిత్యధర్మం
బీయది యని పలికి రాదిఋషిమూర్ధన్యుల్.

విశ్వ—ఏమీ! "ఈయంగవలయు" ఇత్యాది పద్యము పఠించుచున్నాఁడు.

రాజు—మఱేమి?

విశ్వా—అట్లయినం జెప్పు—ఎవని కీయవలయు? ఎవ్వాని రక్షణ సేయవలయు? నెవ్వనితో రణము సేయవలయు?

రాజు—భగవానుఁడా! ఆలకింపుము.

విశ్వా—ఊఁ. మఱి చెప్పు

రాజు—క. ఈవలయును సద్ద్విజులకుఁ,
గావవలె భయార్దితులఁ, బగఱతో రణమున్
గావింపవలయు; నీయది
భావముదృఢపఱచుకొన్న పద్ధతినారా.

విశ్వా— మహాత్మా! నీవట్టి దృఢవ్రతుండవగుటవలన మాకు విద్యాతపోనురూపముగా నేమయినఁ గొంచె మొసంగవలయు.

రాజు— (సంతోషముతో) ఓహో! భగవానుఁడే వైవస్వతవంశ మనుగ్రహీతముగదా! స్వామీ! ప్రసాదింపుము.

ఉ. నేవర సత్కరించుటకుఁ దిన్నఁగ, లోకము లన్ని చాల విం
కావల నేమి యుండు? బిరుదాంబగు నాయఖిలంబు నిత్తు నా
స్వామిబుధాగ్రణీ! యయిన నోపనయావి ప్రతిగ్రహింపుమీ
భూవలయంబు సర్వధనపూర్ణము శాశ్వతముగ నీ కొసంగితిన్.

విశ్వా— (ఆశ్చర్యముతో తనలో) కానీ నే నీలాగు చేసెదను. (ప్రకాశముగా) రాజా! స్వస్తి. సరియేగాని యదక్షిణపుదాన మందురు. కావున దక్షిణ కూడ నివ్వవలయును.

రాజు— (సిగ్గుపడుచుఁ దనలో) ఈయెడఁ జేయఁదగిన దేమి! (చాలఁగ నాలోచించి సంతోషముతో) కానీ. ఈలాగునఁ జేసెదను. (ప్రకాశముగా) ఓ మహాభాగ!

క. గడియించి లక్షహేమము
లిచ్చుకొనియెద దక్షిణగ ఋషీశ్వర మీకున్
దడవనక కరంబున
గడువొసఁగుఁడు నేఁడు మొదలుగా నెల నాకున్,

విశ్వా— ఈగడువు మాకు సమ్మతమే కాని పుత్రమిత్ర విడిచి యొండు కడం గడియించి యొసంగవలయు.

రాజు— (సాశంకముగాఁ దనలో) ఇందుకుం బ్రతివిధాన మేమి (ఆలోచించి హర్షముతో) ఓహోహో! ఎంతచక్కని ప్రతిక్రియ స్ఫురించినది. విశ్వేశ్వరపరిగ్రహం బయిన మహాక్షేత్రము కలదు గదా!

ఇఁక నేను ద్వరితముగా నయోధ్యకుఁ బోయి కౌశిక ప్రతిశ్రుతంబును
సంపూర్ణ పఱచి దక్షిణోపార్జనంబునకయి వారణాసి కేగెదను.

(ప్రకాశముగా) మహానుభావ! తమ రిప్పుడయోధ్యకు విజయం
చేసి నన్ను గృతకృత్యునిం గావించి దక్షిణాసంపాదనంబున కను
మతి యిచ్చి యంపవలయు.

విశ్వా—(ఆశ్చర్యముతోఁ దనలో) అహో! ఈదురాత్ముని మనస్స్థై
ర్యము! ఏమీ! వీనిమహానుభావత్వము! ఆ! దురాత్మ!
అచిరకాలముననే నీబింకము నేను వీక్షించెదను

ఉ. ఓరిమదాంధ! యెందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
ద్రోరపుసత్యసంపదకుఁ దోడసు పాసినవానిఁగాఁ గాఁగ
న్నార నినుం గనంబడయ నందనుకే భవదీయ దుర్మనో
దారత బగ్గుబగ్గను మదాగ్రహమూలనురా దురాత్మకా.

(ప్రకాశముగా) రాజా! అలాగే కానీ. ఏమి దోషము.

(నిష్క్రమించుచున్నారు.)

—* గద్య. *—

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీరనీరాకర రాకాసుధాకర రాచ్చనామాత్య
పౌత్ర హారితసగోత్ర పవిత్రగుణాకదంబ లక్ష్మాం
బాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్ర
ధానతనూభవ విబుధవిధేయ
సుబ్బరాయనామధేయాం
ధ్రీకృతంబగు చండకౌశి
కనాటకమునందు
ద్వితీయాంకము

(తెరలో)

చ. అవుదల శంభుపాదజలజార్చన మాయన కంత ప్రేమ మా
శివకును బుత్రవత్సలత, సిద్ధతపం బతనుశ్రుతంబు నా
కివి యిటు లున్నఁ గీర్తిరము లెమ్ములుఁ దోలునమాయఁబడ్డ జీ
ర్ణవపు విదేని మలంఘ్య పరిణామము ప్రాక్కృతకర్మ మేరికిన్.

(సావష్టంభముగా) ఆ ! అది యాలాగే గదా! * (విస్మయముతో) ఎవఁడురా యిక్కడ మాటలాడుచున్నాఁడు. (తెరవంకఁజూచి) ఓహో! భగవానుఁడయిన విషమలోచనుని యాసన్నపరిచారకుఁడు భృంగీశ్వరుఁ డిదిగో యీలాగున వచ్చుచున్నాఁడు. నేను ద్వరితముగా నవ్వలకుం బోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత భృంగీశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు.

భృంగి—(అవుదల శంభుపాదేత్యాది పఠించి యాలోచించి) దీని కన్యథాత్వంబు గలదా? రాజర్షి యయిన హరిశ్చంద్రునకును దశావిపర్యయము ప్రాప్తమయినట్లు దేవర దేవేకిం దెలియఁబఱచెను.

ఉ. ఆనతి యిచ్చుచో నధిపునద్భుతమైన చరిత్రఁ, జిల్లి నె
మ్మేనిను వెండ్రుకల్ పొడమి మేఁగినబూదియు శూలికిం; దదీ
యానన మాచలద్భ్రినయనాంబురుహాత్రియమయ్యె; ఫాలియుం
బూసినపూపరేవెలుఁగుఁబూవసియాడఁ జలించె మాటికిన్.

ఇప్పు డాచక్రవర్తి యిటకు రాఁగలఁడని దేవీసహితము భగవానుఁడు ఫాలలోచనుఁడు పర్యుత్సుకుఁడయి యున్నవాఁడు. నేనును శీఘ్రముగా భగవదారాధనము నిర్వర్తించుకొని యావేడుకఁ జూడ సిద్ధముగా నుండెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత విచారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.)

ఉ. ప్రీతిని మాసి కచ్చి పృథివిం దయివిం గనమానసం బని
ర్యాతితదక్షిణం దలఁచి వ్యాకుల మయ్యెడు; నాకు నార్జనం
బాతని రాజ్యమందుఁ దగనంకుసఁ దజ్జ్ఞుల ధాత్రి నాని దై
పాతకహారియౌ శివనివాసముఁ జేరుదుఁ గాశికాపురిన్,

(చింతను నటించి నిట్టూర్పు విడిచి) అక్కటా! ఎంతకష్టమెంతకష్టము!

మ. అవశిష్టంబు త్రియంబు త్యాగమున కిమూలుం గుమారుండు మే
నవధిన్ లేదికఁ, గ్రోధి గాధిసుతుఁడ త్యాజ్యంబు సత్యంబు, భూ
దివిజస్వాపహృతంబు గాన విడనైతిం గాదయా! జీవ మే
మి వానర్పంగను బాలువాఁడు మది కేమేలన్ జశల్ శూన్యముల్.

(ముందు చూచి సంతోషముతో) ఓహోహో! ఇదిగో వారణాసి.
తల్లీ! వారణాసి! నమస్కరించుచున్నాను. (ఆలోచించి యాశ్చ
ర్యముతో)

చ. తపముల బ్రహ్మచర్యముల దాంతిశమానశనవ్రతంబులన్
ద్రుపితతముల్ వరింతు రెద సన్యసనంబుల బ్రహ్మనిష్ఠుల
ట్టిపరమతారకంబు శివుఁడే యుపదేశ మొసంగుఁ బ్రాణికిన్
వపువుఁ దొరంగుచో నిటఁ బునర్జననంబింక లేక యుండఁగన్.

చ. సడలనిచావుపుట్టువులసంకెల యూడును బ్రాణికిచ్చటన్;
మృడునికరంబునుండి పడమోర్ మును బ్రహ్మశిరంబు నీడ; ని
య్యెడ నవిముక్తమై యుభవుఁ డేనముఁ బాసి వసించు జాయతో
విడువఁడు దీని నెప్పుడును; వే ఱొక టింతటిక్షేత్ర మున్నదే?

నే నిందే యుపాయంబున మునిఋణంబునకుఁ బాయఁగలవాఁడ. (విచా
రముతో)

మ. ధనదుం గెల్చి గ్రహింతునో ధనము శ్రీత్యక్తంబు నా కేల గె
ల్చును వా యాచన జన్నిగట్లకది చేయన్ దీనతన్ క్షత్రియుల్

ధనమూలంబు బెహార మన్న దది పేదన్ సాగునే నాకు? నే
పఃకిం గాల ముపేక్షణీయ మది యార్వన్ దైవయోగంబునన్
అయ్యో! మందభాగ్యుఁడను నే నేమి చేయుదును? [ఆలోచించి సంతోషముతో] ఓహోహో! దొడ్డయుపాయము తోఁచినది. నే నిప్పుడు.

క. అమ్మకొని నన్ను నేన
త్యమ్మును బాలింతు శాశ్వతమ్ముగ; సదుపా
యమ్మన నది పోవమి ని
కృష్ణమ్ముగ లోకద్వయమ్ము గావమి గాదే?

[సావష్టంభముగా] కుఱ్ఱవాఁడు లోహితాస్యుఁడు వెనుకఁ జిక్కఁగా వాఁకొనుచుఁ బ్రతీక్షించుచు దీర్ఘాధ్వవిశ్రాంత యగు దేవి నన్ను నింకను గలసికొనలేదు. ఆమె రాకమున్నె నేను సత్వరముగాఁ బోయి న న్నొక తీర్చుకొనియెదను. [పైకిఁ జూచి] అబ్బో! అప్పుడే పొద్దు నెత్తిమీఁదికి వచ్చినదే.

ఉ. చండకరుండు కౌశికునిచందమునం దపియించుఁ దీండ్రమై;
మండెడుఁ దెర్వు నామనసుమాదిరి; దైవవశంబునం గటా
యెండను మాఁడిమాఁడి కృశియించిన దేవియుఁ బోలె భూమిరు
ట్షండము క్రిందికిం జనియె ఛాయయు నీయెడ మెల్లమెల్లగన్.

కాఁబట్టి యిప్పుడు గడువునకు — గాదు కాదు — హరిశ్చంద్రునకె, యవసాన మాసన్నమైనది. హా! మందభాగ్యుఁడను నేను నశించితినిగదా! [భూమిమీఁదఁ బడి తిరిగి లేచి దుఃఖముతో] ఓరి దురాత్మ! హరిశ్చంద్రఘాతక!

తే. గీ. మున్నుగా బ్రాహ్మణున కియ్యకొన్నయట్టి
దక్షిణను నీకె బ్రహ్మస్వదగుఁడవును

సత్యచలితుండ వగుచు నేఁడాయ కీవు
సురుఁగువాఁడవురా యోరిపరమనాస్తికుఁడ?

నే నిప్పు డంగడివీథికిం బోయి విక్రయమున నరించెదను. ఇంతను నమ్మహాముని వచ్చి యుండనోపును. [స్వగతముగా నడచి యేకాంతమున నున్నాఁడు]

[తరువాతఁ గోపముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విశ్వా—[తనలో]

చ. కరగత మైన విద్యలవిఘాతముచేతఁ బ్రవృద్ధమై నదీ
యురువ, శరుండు నా వినయాన్వితవృత్తి నిరుద్ధమౌను, లో
దరికొను నెండగట్టియలఁ దద్దయు మండుదవంబు. పైపయిం
గురిసెడు వానలం దడియుకోసను బోలె నను దహించెడుక్.

[కోపముతో] దురాత్మ! హరిశ్చంద్రపాతక!

ఉ. ఓరిమదాంధ! యొందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
దోరపు సత్యపుం బడకఁ దోడ్పడ పాసినవాఁడఁ గాఁగఁ గ
న్నార నినుం గనం బడయ, నంతనుకెన్ భవదీయదుర్నయో
దారత బగ్గుబగ్గన మదాగ్రహ మారుదురా దురాత్మకా.

(చూచి విస్మయముతో) ఏమా! యిదిగో దురాత్ముఁడు— పోనీ మహాత్ముఁడే—వీఁడు వచ్చినాఁడే. సమీపించెదను.

[అట్లుచేసి క్రోధముతోఁ బ్రకాశముగా] ఆప్పురా! యేమిది! మాదక్షిణాసువర్ణము లిప్పటికి నీయకున్నాఁడవు

రాజు—[సంభ్రమముతో] ఓహో! భగవానుఁడు కౌశికుఁడే. స్వామీ! యభివాదనము చేయుచున్నాఁడను.

విశ్వా—ఛీ! యనార్య! నీ నిష్ఫలము మమ్ము శుష్కప్రియములతో వంచింప నెంచుచున్నావురా?

రాజు—(చెవులు మూసికొని) స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు.

విశ్వా—(క్రోధము నభినయించుచు) ఛీఛీ! దురాత్మ! అలీకదాన సంభావనాప్రఖ్యాపితమిథ్యాపౌరుషప్రపంచ! ఉండుండు.

చ. నెలయును నిండకుండఁ గడువు నీ విడ వింకను మాదుదక్షిణల్
వలవని శుష్కపుష్పమధురవాక్యములతో నిటు డాయు చుందువో
పలుప! ప్రతిశ్రుతం బయినపైకము నీయమి నల్గి యిచ్చు ప్ర
జ్వలితకృశానుఘోరతరశాపము నీపయి నిప్పుడే పడున్.

(శాపజలమును గ్రహించుచున్నాఁడు)

రాజు—(సంభ్రమముతోఁ బాదములమీఁదఁబడి) స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు.

క. తాపసవర! మీదక్షిణఁ
బ్రాపింపర యేని ప్రొద్దు వడకుండంగన్
శాపార్హుఁడో యీమనుజుఁడు
వ్యాపాదార్హుండొ మీకు స్వాధీనుఁ డటన్.

కావునఁ బ్రసన్నుల రయి వణిగ్వీథిం బోవుదము రండు.

విశ్వా—(శాపజల ముపసంహరించి) కానీ, అక్కడకే పోయియుందము. ఇంతలో నేనును ద్వితీయస్నానము నిర్వర్తించుకొని వచ్చెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(నిర్వేదించుచుఁ దనలో)

క. పరిణామదారుణం బిహ
పరభయకారణము ఋణము ప్రాణుల కిన్నీ
పరికుపితధనికముఖముం
దరిసింపనినరుఁ డొకండె ధన్యుఁడు పుడమిన్.

(నడచి సంతోషముతో) ఓహో! యిదిగో! వణిగ్వీథి (శిరమునఁ దృణ ముంచుకొని ధైర్యముతో) ఓహో! సాధులారా!

క. ఒదవి యొకానొకయక్కఱ
యది దీఱుచునట్టి వేఱుపాయము లేకే
నిదె లక్షహేమములకుం
గొదుకక యీదేహ మమ్మకొనుచున్నాఁడన్.

ఆర్యులారా! కొనుండి నన్నుఁ గొనుండి. (ఆకాశమున) ఏమనియెదరు? ఎందు కీదారుణకర్మము నారంభించితి వందురా? నన్నిట్లు మీరేల నిర్బంధించెదరు? ఈజీవలోక మతివిచిత్రము గదా! (వేలకోటి కేగి "ఒదవియొకానొక" అనుపద్యమును చదివి యాకాశమున) ఏమనియెదరు? "నీశక్తియేమి? పని యేమి? జ్ఞాన మేమి?" యని యడుగుచున్నారా? (చిఱునవ్వుతో)

క. దేవర యేపని వెట్టినఁ
గావించెదువాఁడ నేను గాదనక మదిన్
సేవకునకు దొరయానతి
యావంతయు మీఱమియెకదా సుగుణ మగున్.

(ఆలకించి) ఏ మనుచున్నారు? నీవు వెల యెక్కుడుగాఁ జెప్పినాఁడవు కాఁబట్టి మఱి యొకబేరము చెప్పు మందురా? (ఖేదముతో) ఓ సాధులార! మేము క్షత్రియులము. మరలమరల బేరములు చెప్పుట యెఱుంగము. మీరు వెడలిపొండు. (వేలకోటి కేగి "ఒదవియొకానొక" అను పద్యమును చదువుచున్నాఁడు.)

(తెరలో) ఆర్యపుత్ర! ఆత్మంభరుండవు గాకుము. అట్లు నీతో సుఖంబునఁ బాలిదాననైన నన్ను మందభాగినిం జేసి నేఁడు సంవిభాగపరాఙ్ముఖుండ వగుట పాడి గాదు. నాథా! ప్రసన్నుండ వయి నన్నే యీకార్యమునకు నియోగింపుము. నీప్రణయ మిప్పుడు సయుక్తము నెప్పటిదేగదా!

రాజు—(వైలక్ష్యముతో) అయ్యో! దేవి వచ్చినదే, నాకోరిక నెఱవేఱినది కాదు.

(తరువాత బాలకానుగమ్యమాన యయి వైక్లబ్యము నటించుచు శైబ్య ప్రవేశించుచున్నది)

శైబ్య—(సకరుణముగా నార్యపుత్రేత్యాది పఠించుచు మెల్లగా నడచి) ఆర్యులారా! సమయదాసినిగా నన్నందలిసగమువెలకు విలుచ కొనుఁడు.

బాలకుఁడు—ఆర్యులారా! నన్నుఁ గూడ విలుచకొనుఁడు.

రాజు—(వేఁడినిట్టూర్పు పుచ్చి తనలో) అన్నా! యెంతకష్ట మెంత కష్టము!

మ. చతురంభోధిపరీతభూతలమహాసామ్రాజ్యమున్ వీడితిన్;
హితులం బాసితి నశ్రుదీనముఖులన్; నే నూఱడింపం బ్రజన్;
సతి పుత్రుం డిపుడమ్ముకోఁదమునిటుల్ సైరించి చూతుం గటా!
శతధా వ్రయ్యదు గుండె, ధాతయిది వజ్రంబున్ విన్ర్మించెనో.

శైబ్య—(బయలు లాలకించి) ఆర్యులారా! యేమనెదరు? సమయమేమనియా? పరపురుషపర్యుపాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మఱి యేకార్యమైనను జేయుదానను. అదియే నాదుసమయము. (మరలఁ జెవి యొగ్గి) ఏమనియెదరు? ఈసమయమున కొడంబడి నిన్నెవఁడు కొనునందురా? అట్లయినచో మీరనుగ్రహించి వెడలి పొండు. ఈజనముతో మీకేమిప్రయోజనము? ఎవ్వఁడేని దీనజనానుకంపి యగుభూపాలింపుఁడు సాధుశిఖామణి నన్నుఁ గొనఁగలఁడు.

(తరువాతనుపాధ్యాయుఁడును వటుఁడును బ్రవేశించుచున్నారు.)

ఉపా—వత్స! కౌండిన్య! నిజముగా నంగడివీథిని విక్రయింపఁ బడుచున్నదా?

వటు—గురువుగారితో నే నసత్యము మనవిచేయుదునా ?

ఉపా—అట్లయిన నక్కడకే పోవుదము.

వటు—చిత్తము. గురువరా ! ఇటువిచ్చేయుడు. డిటువిచ్చేయుఁడు.

ఉపా—(నడచి చూచి యాశ్చర్యముతో) ఓహో ! యంగడివీథి యెంతరమణీయముగా నున్నది!

మ. పసిఁడిన్ మేరుమహాద్రి యన్ మణులచే బాథోధివేలన్, నవా
బ్దసమానోన్నతసామశచ్ఛటల వింధ్యశ్రీ, విడంబించుచున్,
వసనోత్పల్లవ యామిను గల్పలతేవన్ బ్రాభృతాధారంబు ల
భిననూహంబున కిచ్చు విపణి బుద్ధిన్ లోబడున్ జేయుదే.

వటు—స్వామీ ! గురువర్య ! అదిగో నక్కడ గుంపుగా నెందఱో జనులు గనఁబడుచున్నారే అచ్చోట నదిలప్పక యుండునని నే నూహించుచున్నాను. (సమీపించి) అయ్యలారా! దారి దారి. ఓసరిల్లుఁ డోసరిల్లుఁడు.

ఉపా—ఓహో ? యేమి యీసమ్మర్దము !

శైబ్య—(వైక్లబ్యముతో)ఆర్యులారా ! సమయదాసినిగా నన్నందఱి నగము వెలకు విలుచుకొనుఁడు. (మరల నను చున్నది)

బాల—ఆర్యులారా ! నన్నును నన్నును.

ఉపా—(చూచియాశ్చర్యముతోఁ దనలో)ఏమి! యీమెయేగాదా? (ప్రకాశముగా) అమ్మా ! యేమి నీసమయము ?

శైబ్య—బ్రాహ్మణోత్తమ! పరపురుషపర్యాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మఱియేకార్య మయినను జేయుదానను.

బాల—సాధుబ్రాహ్మణా ! నన్నును నన్నును.

ఉపా—(హర్షముతో) నీసమయ మిది యనుకూలముగా నున్నది. ఈ

నియమము తోడనే నీవు మాయింట నివసింపుము. నాభార్య యగ్నిపరిచర్యాపరాధీనత్వమున గృహకృత్యనిర్వహణమునకుం జాల కున్నది. ఇదిగో! ధనంబుం బుచ్చుకొనుము.

శైబ్య—(సంతోషముతో) చిత్తము. భూసురోత్తమ! నే ననుగ్రహింపఁబడితిని.

ఉపా—(తడవుగఁ దేటిపాటఁజూచి విస్మయముతోఁ దనలో)

ఉ. మేలిమిసుంగు మూర్ధమున, మేని సుసాజపుసిగ్గు మోమునన్,
గాళులవేళ్ళఁ జూపుగుటి, పద్దుల మంథరభావ ముక్తులన్
జాలఁగఁగోమలత్వమును జాపియమ్మ మితభావ మిన్నియుం
బోలిచి చూడ నీమెయొఁగుఁబోఁడి కులీనగ నాకుఁ దోఁచెడున్.

(విచారముతోఁ దనలో) ఇట్టి యాకృతివిశేషమున కింతటిదురవస్థ రావలసినది కాదు. ఏమికారణమున నీమె కీదుర్దశ ప్రాప్తించినది చెపుమా? (ప్రకాశముగా) బోటీ! నీపెనిమిటి బ్రతికియున్నాఁడా?

శైబ్య—(తలతో సంజ్ఞ చేయుచున్నది.)

రాజు—(నిట్టూర్పు విడిచి తనలో) హా! యేమిబ్రతుకు! బ్రతికియున్న వానిభార్యకా యిట్టి యవస్థాంతరము?

ఉపా—ఇప్పు డతఁడు నీదగ్గఱ నున్నాఁడా?

శైబ్య—(కన్నీళ్ళతో రాజును జూచుచున్నది.)

ఉపా—(చూచి విస్మయముతో) ఇతఁ డీమెభర్తయా? (తడవుగఁ దేటి చూచి ఖేదముతోఁ దనలో)

శా. మూఁపుల్ గోపతిమూఁపురంబులు, భుజంబుల్ మత్తవేదండశుం
డాపీనాయతముల్, విశాల మురమున్, హా! లోకరక్షార్హ మీ
రూపం బేమి? కిరీటయోగ్యశిర మారోహించు చుండె తృణం
బాపాదింపఁడు వేని కేసెరగు వామారంభుఁడౌ ధాత తాన్?

(సమీపించి కన్నీళ్లతోఁ బ్రకాశముగా) ఓయిమహాత్మ! నీవు స్వదుఃఖమున నన్నుం బాలివానింగాఁ జేసికోఁ దగును. నీయీప్రయత్న మెందునిమిత్తమో నాకుఁ దెలియఁబఱుపుము.

రాజు—(ఆలోచించి వైక్లబ్యముతోఁ దనలో) ఈసాధుజనునివచన మన్యథాకరించుట యుక్తము గాదు. (ప్రకాశముగా) సాధువర్యా! విస్తరించి చెప్పుటకు దేశకాలము లనుకూలములు గావు. సంక్షేపించి వినిపించెదఁ జిత్తగింపుము. బ్రహ్మస్వపీడితుండ నయి నే నీప్రయత్నముఁ జేయుచున్నను. ఇఁక నన్నేమియుఁ జెప్పు మని నిర్బంధింపకుము.

ఉపా—అయ్యా! అట్లయిన నీకుఁ గావలసినధనము నేనిచ్చెదఁ బ్రతిగ్రహింపుము.

రాజు—(చెవులు మూసికొని) ఓహో సాధువర్య! నీ వన్నది ప్రథమవర్ణవృత్తి. మాబోఁటులకది నిషిద్ధముగదా! నీవు నన్నుఁ గనికరించితి వేని దానిని మూల్యసంబంధమున ననుగ్రహింపుము.

శైబ్య—(తొందరగా సమీపించి వినయముతో నంజలిపట్టి) ఆర్య! ఆర్య! ముందుగ బేర మాడిననన్ను నిరాకరించుట నీకుఁ దగదు. నేను నీపాలఁ బడితిని. నన్ననుగ్రహింపుము.

ఉపా—(కన్నీళ్లతో) ఓ సౌభాగ్యవతీ!

ఆ. వె. ఏను దెచ్చియున్న హేమంబు లరలక్ష,
యీధనంబు మీకు సిద్ధమగును;
యుక్తమెట్టు లట్టు లొనరింపఁగాఁ దగు
నరసికొని పరస్పరానుమతిని.

(సొమ్మునిచ్చుచున్నాఁడు.)

శైబ్య—(పుచ్చుకొని సంతోషముతో) అదృష్టవశమున నార్యపుత్రు

